60th Year of Publication వజ్రోత్సవ సంవత్సరం

# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు * సంపాదకుడు: నెల్లూరు శోభేంద్రప్రసాద్ * మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి

ESTD. 1930
Regd No. H. NL.18
సంపుటి: 60 సంచిక: 42
20-10-1989
నెల్లూరు
శుక్రవారం
12 పేజీలు రూ 1.50

## దిగ్భ్రమగొల్పనున్న దేశం టికెట్ల పంపకం!

శాసనసభ ఎన్నికల ప్రకటనతో ఉన్నట్లుండి రాష్ట్ర రాజకీయ వాతావరణం అల్లకల్లోలమైపోయింది. అన్ని పార్టీల రాజకీయ వాదులకూ ఇది ఊహించని పిడుగే! మరీ తెలుగుదేశం నాయకులకైతే ఊపిరి పీల్చుకునే వ్యవధిలేని పరిణామం. దమ్ముంటే ఎన్నికలు పెట్టండి, మేమడిగిన ప్రకారం శాసనసభకు ఎన్నికలు జరపకుంటే మీ అంతుచేయిస్తాం అని పత్రికా ప్రకటనలతో ప్రగల్భాలు పల్కుతుండిన తెలుగుదేశం నాయకులకు రాజీవ్‌గాంధీ నిర్ణయం గొంతులో పచ్చి వెలక్కాయ లాగా పడింది. 18 తేది జరిగిన కాంగ్రెస్ పార్లమెంట్ సభ్యుల సమావేశంలో రాజీవ్ గాంధీ మాటల తీరునుబట్టి, ఎన్నికలు జనవరి తర్వాతనే అనుకుంటుండినారు ఆ ఉద్దేశ్యంతోనే ఎన్టీఆర్‌తోసహా అందరూ ఉదాసీనంగా వుండినారు

విశ్వామిత్ర షూటింగులో వున్నప్పుడు మధ్యాహ్నం రేడియోలో విన్నారు. ఈ

**మా హైదరాబాదు ప్రత్యేక విలేఖరి**

వార్తను శ్రీ ఎన్. టి. ఆర్. అప్పటికప్పుడు ఆయన హైదరాబాదులో వుండిన పొలిట్‌బ్యూరో సభ్యులనుపిల్చి చర్చలు జరిపారు. విశ్వామిత్ర షూటింగ్ సైతం నిల్పివేయాలని నిశ్చయించారు.

కాని ఊహించని తేదీలతో ఎన్నికలు ప్రకటితమైనాయనేదితప్ప రెండు ఎన్నికలకు తెలుగుదేశం సిద్ధంగానేవుంది. అభ్యర్థుల విషయంలోకూడా ఎన్. టి రామారావు ఎప్పుడో ఒక అవగాహనకు వచ్చేశాడు. పోలీసు ఇంటలిజెన్స్, పార్టీ ఇంటలిజెన్స్ వర్గాలనుంచి అన్ని నియోజకవర్గాల అభ్యర్థుల వివరాలను తెప్పించుకున్నారు. చంద్రబాబు కంప్యూటర్ సంగతి సరేసరి! అందువల్లే హఠాత్తుగా ఎన్నికలనేసరికి, విశ్వామిత్ర అర్ధాంతరంగా ఆగిపోతుందన్న ఆవేదనతప్ప ఎన్. టి. ఆర్. లో పెద్దగా కలవరం కల్గలేదు. ఆర్థికంగా

-తరువాత 7వ పేజీలో

సెప్టెంబర్ 29తేది అమెరికాలో 'జివి కె అమెరికా ఇన్ కార్పొరేటెడ్' సంస్థ భూమిపూజోత్సవం జరుపుతున్న అధినేత జి. వి. కృష్ణారెడ్డి, నార్త్ కరోలినా గవర్నర్ జేమ్స్ జి. మార్టిన్, భారత ఆర్థిక మంత్రి ఎస్. బి. చవాన్.

(ప్రత్యేక వ్యాసం 2పేజీలో)

జి.వి.కె. పారిశ్రామిక విస్తరణకు పునాదివేసిన హైదరాబాద్‌లోని నోవోపాన్ ఫ్యాక్టరీ దృశ్యం

# జి.వి.కె. వ్యక్తిత్వవికాసానికి అమెరికన్లే ముగ్ధులైనారు!

జి. వి. కె.

ఒక నవనవోన్మేషమైన పారిశ్రామిక సామ్రాజ్య విస్తరణకు ఈ మూడక్షరాలూ మూడు స్తూపాలంటివి; నాలుగవ స్తంభం ఆ అక్షరాలు కల్గిన వ్యక్తి ఆత్మవిశ్వాసమే!

తనపేరును మూడంటే మూడక్షరాలతో పొట్టిగా మార్చుకున్న గునుపాటి వెంకట కృష్ణారెడ్డి ఆంధ్రరాష్ట్ర పారిశ్రామిక రంగంలోకి ఎంతో పొడవైనవాడు కావడం విశేషం. పొడుగంటే అడుగులు, అంగుళాలలోకాదు. కీర్తి, ప్రతిష్ఠంలో! జివికె కంటే పెద్దపరిశ్రమలు స్థాపించినవారుండవచ్చు; జివికె కంటే, కోట్లార్జించినవారు వుండవచ్చు; జి వి కె కంటే పలుకుబడి గల్గినవారూ వుండవచ్చు; కానీ జి వి కె వలె ఆంధ్రరాష్ట్రం పేరు అమెరికా సంయుక్తరాష్ట్రంలో మార్మోగింపజేసిన వారు ఎవరూలేరు.

పరిశ్రమలు పెట్టడంవేరు; పెట్టే ప్రతి పరిశ్రమలో తన వ్యక్తిత్వాన్ని వికసింపజేసుకోవడం, తనకీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపజేసుకోవడం వేరు. జి. వి. కె. పారిశ్రామిక కల్పన ఎంత గొప్పదికాకుంటే, ఆయన వ్యక్తిత్వ రాశి ఎంత సమున్నతమైనదికాకుంటే అమెరికా ప్రభుత్వం ఆయన్ను అంత సగౌరవంగా ఆహ్వానిస్తుంది; అమెరికా ప్రజలు అంత హార్దికంగా స్వాగతిస్తారు.



ప్రపంచ పారిశ్రామిక సామ్రాజ్యంలో విజయస్తూపం నాటినారు మీరు! పుట్టినగడ్డలో ప్రత్యక్షమవుతూ సంతోష పులకితాంతం చేసినారు!

సెప్టెంబర్ 29 తేదీ జి వి కె నూతన పరిశ్రమ "జివికె అమెరికా ఇజాకార్పొరేషన్" భూమి పూజోత్సవం జరిగినతీరు, దానిపై అక్కడి స్థానికులు స్పందించిన తీరు చూస్తుంటే, ఆశ్చర్యం గొల్పుతుంది. ఆ శంకుస్థాపనోత్సవం కళ్ళు చూసే అవకాశం కల్గలేదు కాని, దానిపై అక్కడి స్థానిక పత్రికలు ప్రచురించిన వార్తలు చదువుతుంటే ఆశ్చర్యం అనిపిస్తుంది!

భారతదేశంలో అద్భుత వ్యాపార విజయం సాధించిన నొవోపాన్ పార్టికల్ బోర్డ్‌ను అమెరికాలోనూ తయారుచేయడానికి నార్త్ కరోలినా రాష్ట్రం మౌంట్ గొమరీకౌంటీలో 'జివికె అమెరికా' సంస్థను ప్రారంభించబోతున్నారు. ఐదేళ్ళ ప్రణాళికలో, పందకోట్ల పెట్టుబడితో అంచెలంచెలుగా నిర్మితమయ్యే ఈ పరిశ్రమకు 29తేది భూమిపూజ శంకుస్థాపనచేశారు. భారత ఆర్థికమంత్రి శ్రీ ఎస్.బి. చవాన్. నార్త్ కరోలినా రాష్ట్రగవర్నర్ శ్రీ జేమ్స్ జి. మార్టిన్ చేతులమీదుగా ఇది జరిగింది.

ఈ పరిశ్రమ స్థాపనను, తమప్రాంత అభివృద్ధికి ఒక సంకేతంగా భావించినట్లున్నారు స్థానికులు. శంకుస్థాపనోత్సవం జరిగేరోజు మౌంట్ గొమరీ పట్టణంలో వ్యాపారస్తులు అంగళ్ళుమూసి సభకు వచ్చారట; విద్యాసంస్థలకు సెలవు ప్రకటించారు. నార్త్ కరోలినాకు చెందిన పలువురు సెనెటర్లు, న్యాయమూర్తులు, రాజకీయ ప్రముఖులు, పారిశ్రామికులు విచ్చేశారు. స్థానిక పత్రికలలో దీనికి విశేష ప్రాధాన్యమిచ్చి ప్రచురించారు. ఒక పత్రికైతే రెండుపేజీల వార్త వ్రాయడంతో పాటు, 9 ఫోటోలు ప్రచురించింది. మొత్తం సభా కార్యక్రమాన్ని న్యూయార్క్‌తో సహా పలు ప్రదేశాలలో టి.వి.లో ప్రదర్శించారు.

ఈ ప్రతిస్పందనకు తగినట్లుగానే జివికె, సభను అత్యంత ఘనంగా జరిపారు. ఫ్యాక్టరీ నిర్మించబోయేది—ఊరికి మైలు దూరంలోనట. సభ జరిగింది, మౌంట్ గొమరీ హైస్కూలు మైదానంలో. పచ్చటి పచ్చిక బయలులో కళాత్మకంగా వేదిక నిర్మింపజేశారు. ఫ్యాక్టరీస్థలంనుంచి తెచ్చిన మట్టిని ఒక పెద్ద చెక్కపెట్టెలో పోసి, అతిథులిద్దరిచేత పారలతో పగులగొట్టించారు.

గవర్నర్ శ్రీ జేమ్స్‌మార్టిన్ ఈ పరిశ్రమ తమ రాష్ట్రంలో నెలకొల్పుతున్నందుకు ఎంత సంతోషపడ్డారంటే—నొవోపాన్‌కు అవసరమైన శిల్పులకి తమ కాలేజీలలో తమ ఖర్చుతో శిక్షణనిప్పిస్తానని చెప్పారా

—తరువాత 8వ పేజీలో



## పినాకినీ తీరం

### రచ్చకెక్కిన 'హిందూ'!

ప్రతిష్ఠాత్మకమైన 'హిందూ' పత్రిక రచ్చకెక్కింది; రచ్చకెక్కింది అనడం కంటే, రచ్చకీడ్చబడింది అనడం సముచితంగా వుంటుంది. సమ్యగ్మైన, నిష్పాక్షికమైన వార్తలకు కీర్తిగన్న పత్రిక 'హిందూ'. సంచలనాత్మకము, ఎల్లోజర్నలిజానికి దూరమైన సాంప్రదాయకమైన పత్రిక 'హిందూ'; 'హిందూ' లో వచ్చిన వార్త అధికారపు వార్తతో సమానమైనదనే వున్నత ప్రమాణాలను, స్థాయిని వంద సంవత్సరాల సంయమనపు విధానంతో నెలకొల్పుకోగలిగిన పత్రిక 'హిందూ'; ఇప్పటివరకు ఇంటాబయట వివాదానికి గురికాకుండా హుందాగా వున్న పత్రిక 'హిందూ'.

అటువంటి చరిత్రగలిగిన పత్రికలో ఇటీవల పెద్ద కుదుపులు, మార్పు కనపడుతున్నది; అటు ఇటు కాకుండా మధ్యమార్గంలో ఒడిదుడుకులు లేకుండా, సమతలం మీద ప్రయాణిస్తుండిన ఆ పత్రిక కొంతకాలంగా ఒక పక్షానికి లాగబడుతున్నది. ఒక రాజకీయ పార్టీపట్ల గాని, నాయకునిపట్లగాని; అధికారపక్షంపట్లగాని, ప్రతిపక్షంపట్లగాని ప్రత్యేక అభిమాన దురభిమానాలు వార్తాపరంగా ప్రకటించబడేయని ఈ పత్రిక, ఈమధ్య కాంగ్రెస్ వ్యతిరేక పార్టీల వాణిగా మార్చివేయబడింది. సి. పి. ఎం. కు అనుకూలమైనదనే భావాన్ని కొందరిలో, ఎన్.టి. రామారావును మహానాయకుడుగా చిత్రిస్తున్నదనే అభిప్రాయాన్ని మరికొందరిలో ఏర్పరచిన ఈ పత్రిక, రాజాగా ప్రతిపక్షం 'మౌత్‌పీస్' అయిపోయింది. వార్తలు, శీర్షికల విషయంలో తులనాత్మకమైన తన పాతవిధానానికి స్వస్తిచెప్పింది. ఒక్కమాటలో చెప్పాలంటే 'హిందూ' కు 'అడిక్ట్' అయిన పాఠకలోకం దాన్నే ఎందుకు చదవాలి, మరో ఆంగ్ల దినపత్రికకు ఎందుకు మారకూడదు అనే తలపు ప్రారంభమయ్యేట్లుచేసింది. 'హిందూ' లో వచ్చిన ఈ మార్పు శ్రీ ఎన్. రాం అసోసియేట్ ఎడిటర్ అయినతర్వాత ప్రారంభమై, అది పరాకాష్ఠకు చేరి, బోఫోర్స్ గొడవతో బట్టబయలైంది. సంపాదకుడు శ్రీ జి. కస్తూరి హఠాత్తుగా శ్రీరాం అటకట్టించడం, శ్రీరాం బహిరంగంగా కస్తూరిమీద ధ్వజమెత్తడం జరిగింది.

ఈ విషయంలో శ్రీరాంనేనిందించలేము. బోఫోర్సు విషయమై 'హిందూ' ద్వారా శ్రీరాం ఇంతకాలంనుండి రాజీవ్ గాంధీమీద పగబట్టి కత్తులుదూస్తుంటే సంపాదకుడుగా శ్రీ కస్తూరి ఏమిచేస్తున్నట్లు? 'హిందూ' సంస్కృతి, సంప్రదాయాలు ఇంతకాలం ఏమైనట్లు? కాని పత్రికకు సంబంధించి మంచిగాని, చెడుగాని తుదిమాట సంపాదకుడిదే; దాన్ని సవాల్‌చేసి పీఠికెక్కడం సత్సాంప్రదాయాలకు విరుద్ధమే. ఆ నాడు ఇప్పుడు దినపత్రికలు దినపత్రికలుగా లేవు; జర్నలిస్టులు జర్నలిస్టులుగా లేరు. జర్నలిస్టులకు పూర్వం సొంత అభిప్రాయాలు, వ్యక్తిత్వాలు వుండేవి; వేతనాలు నాలు అప్రధానం. ఇప్పుడు వేతనాల కోసం మొదటి రెండిటినీ త్యాగంచేసివేశారు; జర్నలిస్టులకూడా ప్రస్తుతం చదువుకున్న, సంఘంలో గౌరవంగా చూడబడే కార్మికులే! ఒకకోట్లు పెట్టుబడిదారు దేశం పలుచూలలా పది పదిహేను పత్రికలు పెట్టి, పత్రికా సామ్రాజ్యాలు నెలకొల్పుకొని, పేద ప్రతిభగల జర్నలిస్టులను కొనుగోలుచేసి, తమ ఇష్టాయిష్టాలకనుగుణంగా వ్రాయిస్తూ, అదే ప్రజాభిప్రాయంగా చిత్రించి, ప్రభుత్వాలను, ప్రభుత్వాధినేతలను కూలుస్తూ, పత్రికారంగాన్ని వస్తువ్యాపారరంగంగా మార్చి ప్రజలను కొల్లగొట్టే ఈ దౌర్భాగ్యపురోజుల్లో, పవిత్రమైన పత్రికాస్వాతంత్ర్యాలనుగూర్చి ఎవరు మాట్లాడినా హాస్యాస్పదంగా వుంటుంది! 'హిందూ' వివాదానికి సంబంధించిన వ్యాఖ్యకాదిది; నేటి పత్రికలు, జర్నలిస్టుల తీరు తెన్నులనుగూర్చిన ఆవేదన!

అవినీతికి సంబంధించిన పరిశోధన, ప్రచారం, నిరోధం ఒక్క బోఫోర్సుకో, లేక పార్టీగా కాంగ్రెస్‌కో, నాయకుడుగా రాజీవ్‌గాంధీకో పరిమితంకాకూడదు ఆ పరిశోధన, గోరంతలను కొండంతలుగాచేసే ప్రచారం రాజకీయ కక్ష కార్పణ్యాలతో కూడి వుండకూడదు. ఎక్కడ, ఎవరికి సంబంధించి ఎంతగావున్నా అవినీతి అవినీతే. దేశంలో, రాజకీయవాదులలోగాని, వ్యక్తులలోగాని ప్రజాధనం ఎంతగా కొల్లగొట్టబడుతున్నది? అభివృద్ధి కార్యక్రమాలకు వుద్దేశించిన ధనం ఎంతగా దుర్వినియోగమైపోతున్నది? కన్నుమూసి కన్ను తెరిచేలోగా ఎందరు కోటీశ్వరులైపోతున్నారు? కాంగ్రెస్ ముఖ్యులేగాక, ఎంతమంది ప్రతిపక్ష ముఖ్యమంత్రులు, మంత్రులు అవినీతి ఆరోపణలతో మునిగిపోయివున్నారు? అవినీతితో దేశంలో పంచుకోబడుతున్న ధనం ఎన్నివేలకోట్లు వుంటుంది? ఒకవేళ ఎవరికైనా ముడుపులు ముట్టాయనుకున్నా, దేశంలోని అవినీతితో పోలిస్తే బోఫోర్సుది ఏపాటి?

ధర్మసంరక్షణార్థం అవతరించిన ప్రతిపక్ష నాయకులుగాని, శ్రీ ఎన్. రాం వంటి పాత్రికేయులుగాని దేశంలోని అవినీతిమీద, ప్రతిపక్ష ప్రభుత్వాల నీతిమాలినతనం మీద నోరెత్తరేమి? పరిశోధనలు సాగించి

—తరువాత 11వ పేజీలో

# జమీన్‌రైతు

## ఓటమి రాజీవ్‌ది కాదు

పంచాయతీరాజ్, నగరపాలిక బిల్లులకు సంబంధించిన 64, 65 రాజ్యాంగ సవరణలను రాజ్యసభ ఓడించింది. ఈ సవరణలను ఇదివరకే లోక్‌సభ ఆమోదించింది. రాజ్యసభ ఆమోదించనందువల్ల సవరణలు అమలుకురావు. బిల్లులు ఆమోదించబడడానికి 64 వ సవరణకు నాలుగుఓట్లు, 65 వ సవరణకు ఐదుఓట్లు తక్కువయ్యాయి. రాజ్యాంగ సవరణ ఆమోదానికి హాజరైన సభ్యులలో మూడింట రెండు వంతుల బలం కావాలి!

ఈ రాజ్యాంగ సవరణ ఓటమి రాజీవ్‌గాంధీ ఓటమికాదు; కాంగ్రెస్ ఓటమి అంతకంటేకాదు; పంచాయతీల, మునిసిపాలిటీల స్వతంత్రతకు, పటిష్టతకు, రాజ్యాంగబద్ధమైన హక్కులకు కలిగిన ఓటమే- నిస్సందేహంగా! కాంగ్రెస్ వ్యతిరేకపక్షాలు కేంద్రప్రభుత్వం చేసే ప్రతిపనినీ దురుద్దేశ్యపుదృష్టితో చూస్తున్నవి; ఎన్నికల కోణం నుండే వీక్షిస్తున్నవి; రాజకీయంగా కాంగ్రెస్‌కు బలం చేకూరుతుందేమో ననే భయసందేహంతోనే పరిశీలిస్తున్నవి; నిర్ణయాలు తీసుకుంటున్నవి. అదేవిధంగా ప్రధాని రాజీవ్‌గాంధీ కలలోకూడా వారికి భూతంగా కనపడుతున్నారు; ఆయనవేసే ప్రతి అడుగుకు అదిరిపోతున్నారు. లేకుంటే పంచాయతీరాజ్ సంస్థలు, పురపాలకసంఘ ప్రయోజనాలకు సంబంధించిన రాజ్యాంగ సవరణలను ఓడించవలసిన అవసరమేమిటి? సూత్రప్రాయంగా ఆ సవరణల సమంజసత్వాన్ని అంగీకరిస్తూనే, వాటికి వ్యతిరేకంగా ఓటువేయడమేమిటి?

వీటిపై ప్రతిపక్షాలఆక్షేపణ ఒక్కటే ఒకటి–రాష్ట్ర ప్రభుత్వాల అధికారాలను ఈ సవరణలు హరిస్తున్నాయనేదే వారి ఆక్షేపణ! రాష్ట్రాలంటే ప్రతిపక్షాలు అధికారంలో వుండే ఐదారు రాష్ట్రాలేకాదు; దేశంలో అంతకు నాలుగింతలుగావుంది రాష్ట్రాల సంఖ్య. వారికిలేని భయం, ఆక్షేపణ వీరికెందుకుండాలి? రాజ్యాంగ సవరణలవల్ల పార్లమెంటు,శాసనసభ ఎన్నికలవలె నిర్ణీతకాలంలో స్థానికసంస్థలఎన్నికలు జరిగితీరుతాయి; ప్రభుత్వపార్టీ అధికార దుర్వినియోగానికి అవకాశం లేకుండా స్వతంత్ర ఎలక్షన్ కమిషన్ ఆధ్వర్యంలో ఎన్నికలు నిర్వహించబడుతాయి; స్త్రీలు,హరిజన గిరిజనాది బలహీనవర్గాలవారికి అత్యధిక రిజర్వేషన్లులభిస్తాయి; ప్రణాళికాభివృద్ధి పైనుండిక్రిందికి నెత్తినరుద్దబడడంకాకుండా,గ్రామపట్టణస్థాయిలలో తమఅభివృద్ధి కార్యక్రమాలను ఆయాప్రజలే నిర్ణయించుకొని, అమలుజరుపుకునే అవకాశముంటుంది; అభివృద్ధి కార్యక్రమాలకు కేంద్రం నుండి పుష్కలంగా నిధులు లభిస్తాయి. పంచాయతీలకు, మునిసిపాలిటీలకు అంతటి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు, లాభాలు వున్నాయి. కేంద్రం నిధులు సమకూర్చినా, కార్యక్రమాలు నిర్దేశించినా ఇతర సూచనలుచేసినా అవి రాష్ట్ర ప్రభుత్వంద్వారా అమలుజరుగుతాయిగాని, కేంద్రం నేరుగా అధికార దురాక్రమణ చేయడానికి వీలులేదు. ఇటువంటి సదుద్దేశ్యంతో, గ్రామ స్థాయిలో ప్రజలకు మరిన్ని అధికారాలు, అవకాశాలు చేకూర్చిపెట్టే ఈ రాజ్యాంగ సవరణలను ప్రతిపక్షాలు ఓడించడం కాంగ్రెస్‌కు మంచి పేరు వస్తుందనే అసూయతో, దురుద్దేశ్యంతో గ్రుడ్డిద్వేషంతో ప్రజలకు ద్రోహంచేయడమే అవుతుంది.

గతంలో మనరాష్ట్రంలోనే పన్నెండేళ్ళపాటు పంచాయతీ, మునిసిపల్ ఎన్నికలు జరగలేదు; హైదరాబాదు కార్పొరేషన్ ఇంకా ఎక్కువకాలమే ప్రత్యేకాధికార్ల పెత్తనంలో వుండినది. ఈ లోపం కాంగ్రెస్ అధికారంలో వున్నప్పుడే జరిగింది. తెలుగుదేశం ప్రభుత్వం మండలాలను ఏర్పాటుచేసింది. పంచాయతీ ఎన్నికలు జరిపింది. కాని వాటికి అధికారాలులేవు; నిధులులేవు ప్రచారానికి చెప్పుకోడానికి తప్ప, అవి నిరుపయోగపు సంస్థలుగా పడివున్నాయి. అటువంటి సమయంలో కేంద్ర ప్రభుత్వం విడుదలచేసిన నెహ్రూ రోజ్‌గార్ నిధులవల్ల ప్రతిగ్రామంలో ఏదోఒక అభివృద్ధికార్యక్రమం జరుగుతూ, చైతన్యం ప్రారంభమైంది. నగరపాలిక పథకంక్రింద నిధులు విడుదలైతే పట్టణాలలోని పేదలకు, నిరుద్యోగులకు ఎంతో ఉపకారంజరిగే అవకాశం వుంటుంది.

రాజ్యాంగ సవరణలను ప్రతిపక్షాలు ఓడించడంద్వారా తమకు ఎంత అపకారం జరిగిందీ ప్రజలు గమనించాలి!

---

### జమీన్‌రైతు

20-10-1939
16 పేజీలు అణా

### జమీందారీ బిల్లు

అసెంబ్లీ నవంబరు సమావేశంలో ప్రవేశ పెట్టబడును.

మద్రాసు అసెంబ్లీ సమావేశం నవంబరు 15 తేదిన జరుగును. ఆ సభలో జమీందారీ బిల్లు తప్పక ప్రవేశ పెట్టబడునని తెలియుచున్నది.

### ఆంధ్ర జమీన్‌రైతు సంఘాధ్యక్షులు

శ్రీ పటేల్‌గారిని కలుసుకొనిరి

11 తేది 12 గంటలకు ఆంధ్ర రాష్ట్ర జమీన్‌రైతు సంఘాధ్యక్షులు శ్రీ రె వెంకటేశ్వర శర్మగారు, వార్ధాలో శ్రీ సర్దారు వల్లభాయి పటేలుగారిని కలుసుకొనిరి. పార్వతీపురం మొదలగు ప్రాంతములనుండి జమీన్ రైతులు యిచ్చిన గ్రామములన్నూ, వారికి నివేదించిరి. శ్రీ ప్రకాశం కమిటీరిపోర్టు వెలువడినది మొదలు నేటివరకు ఆయా జమీందారీలలో రైతుల కష్టములు యే విధంగా హెచ్చుగుచున్నదియు, రైతులలో జమీందారీ బిల్లును గూర్చి నెలకొనియున్న తీవ్ర ఆందోళనమును గూర్చియు, తప్పక నవంబరులో బిల్లు శాసనసభలో ప్రవేశపెట్టునట్లు చూడుట విధిక్కృత్య మనియు సవివరంగా తెలిపిరి. శ్రీ పటేలుగారు యీ విషయముగూర్చి తక్షణమే కర్తవ్యానికి పూనుకొనెదనని తెలిపిరి. శ్రీ విశ్వనాథదాసు మహాశయులు, శ్రీ రాజగోపాలాచారి గారిని కూడ కలుసుకొని యీ విషయముగూర్చి మాట్లాడిరి.

### రైతు రక్షణవారము

అక్టోబరు 28 నుండి 3 నవంబరువరకు

ఆచార్య రంగాగారి సందేశము

జమీన్‌రైతులారా, ఇంతవరకు మీ దాస్యము "పటాపంచలు కావలయును. రండి! రండు!! జమీన్‌రైతు

## 50 ఏళ్ల క్రితం ఈ వారం

రాజ్యము స్థాపించుడు. ఇదియే అఖిల భారత రైతునాయకులైన ఆచార్య రంగాగారి సందేశము. ఈ వారములోనే అద్భుతమైన రైతు [illegible] మాన్ని లేవదీయవలెను గ్రామగ్రామాలలో సభలుజరిపి, రైతుల కోర్కెలను ప్రచారకగా తయారుచేసి స్థానిక రివిన్యూ ఉద్యోగస్థులవద్దకు బ్రహ్మాండమైన రైతుయాత్రలను తీసికొనిపోవలెను. వెంటనే రిపోర్టు ఆంధ్ర రాష్ట్రరైతుసంఘమునకును,అన్నిపత్రికలకును, ముఖ్యముగా జమీన్‌రైతుల పత్రికైన "వాహిని", 28, స్ప్రింగర్ స్ట్రీటు, టి.నగరు దాసుకు పంపవలెను.

జై జమీన్‌రైతు రాజ్యానికి జై.

---

### కొరడా దెబ్బలు–చిత్రగుప్తుడు

వర్గకక్షి ఉపాధ్యక్షులు కాంగ్రెస్ వ్యతిరేకపక్షాలనాడులో గోపాలుని త్రిపురయ్యతోగూడా అన్ని పోటీలకు వెళ్ళవచ్చుననీ, ఇంకా ఏమోచేసేవారనీ, అది లౌకిక పక్షం వహించినట్లు అపార్థమౌతున్నదనీ, కాంగ్రెసు పక్షీయులు అంటున్నారే దీనికేమి సమాధానం?

* * *

నెల్లూరు న్యాయవాది కాంగ్రెస్ అభిమాని మొగల్లూరువాసి శివరామయ్యగారు ఏం మంత్రం పూరాతో గాని తమగ్రామంలో ఒక్కఓటుగూడా పొదలకూరు సర్కిలులో కాంగ్రెసు పెట్టెలో పడలేదు. కాడకెళ్ళ వదిలేసి వుండే ఒక్కఓటుకూడా యితర అభ్యర్థికి పోదు. అన్నీ కాంగ్రెసువే! ఏం రామయ్యగారూ! ఎందుకు మనశివయ్య పనిచేయలేదు.

### మనలో మాటలు–చిత్రగుప్తుడు

నా కలం ఎవరికీ కుదవపెట్టలేదు. కాబట్టి స్వేచ్ఛగా, నిర్భయంగా, నిర్మొగమాటంగా విమర్శించే అధికారం కుంటుపడలేదు; కుంటుపడదు. వ్యక్తుల మొగమాటాల కోసరం రాజకీయాలలో నంగినంగిగా, తగిలీతగలనట్లు మాట్లాడి తప్పుకోవడం సమాజంపట్ల వంచనే యగును. నేను చేసినది తప్పయితే లెంపలు వేసుకోడానికికూడా సిద్ధం— తప్పు కానప్పుడు నేనెందుకు లొంగాలి?

---

# ఎన్నికలు పిరికిచర్య అనడమే పిరికితనం!

ప్రధాని రాజీవ్‌గాంధీ నవంబరులో ఎన్నికలు ప్రకటిస్తే దాన్ని 'పిరికిచర్య'గా ఎన్.టి. రామారావు అభివర్ణించడం ఆశ్చర్యం గొల్పుతున్నది. నిన్నటివరకు ప్రధాని లోక్‌సభను రద్దుచేసి ఎన్నికలు జరిపించాలని కాకిగోల చేస్తుండిన ప్రతిపక్ష నాయకులకు ఈయన ప్రధాన నాయకుడు; ఎన్నికలు వాయిదావేసేట్లున్నారని, అసలు ఎన్నికలే జరపడేమోనని పలురకాలుగా మాట్లాడుతుండినవారు వీరు; ఎన్నికలకోసం రాష్ట్రపతి దగ్గరకు రాయబారం వెళ్ళాలనికూడా ఉద్యమిస్తుండినారు. అటువంటి నాయకులకు ఎన్నికల ప్రకటన 'పిరికిచర్య'గా కన్పడడం వింతకల్గిస్తూంది.

సీట్ల సర్దుబాట్లు కుదరక; బిజెపి, సిపిఎంలమధ్య పొత్తుసాధించలేక అయోమయంలో కొట్టుమిట్టాడుతున్న ప్రతిపక్షాలకు ఎప్పుడుఎన్నికలు పెట్టినా ఒకటే. వాళ్ళు ఒకటికాలేరు, అధికారంలోకిరాలేరు. వచ్చినా నెలరోజులు నిలవుకోలేరు. ఆడలేక మద్దెల ఓడన్నట్లు నవంబరు ఎన్నికలను నిందించడం అన్యాయం.

నెల్లూరు —ఎం. మాధవరెడ్డి.

### కర్ణాటక ఏమి పాపంచేసింది?

దేశంలో పార్లమెంటు ఎన్నికలను నిర్వహించాలని ప్రధాని రాజీవ్‌గాంధీ తీసుకున్న నిర్ణయం స్వాగతించదగినదే. అయితే ఎన్నికలను సకాలంలో జరుపుతామని ప్రతిపక్షాలని మభ్యపెడుతూ, వారు ఆదమరచివున్నప్పుడు హఠాత్తుగా తేదీలు ప్రకటించడం అన్యాయం. ఇందులో ప్రధాని రాజకీయ దురుద్దేశాలు విదితమై పోతున్నాయి.

కర్ణాటక, పంజాబ్ రాష్ట్ర శాసన సభలకు ఎన్నికలు ప్రకటించకపోవడం కూడా ప్రజాస్వామ్య విరుద్ధమైన చర్య. ఆ రెండు రాష్ట్రాలలోనూ ప్రజాస్వామ్య పరిపాలన పునరుద్ధరణ కోరుతూ ప్రతిపక్షాలు ఉద్యమించాలి అవసరమైతే లోక్

### జనవాణి

సభ ఎన్నికలను బహిష్కరించి అయినా సరే ఈ విషయమై తమ నిరసన ప్రదర్శించాలి.

నెల్లూరు —తుంగా పాండురంగారెడ్డి
ఉపాధ్యక్షుడు
ఆం. ప్ర. లోక్‌దళ్ (బి)

### విజయమహల్ రైల్వే గేటురోడ్డు గతింతేనా?

విజయమహల్ రైల్వే గేటు నుంచి బాలాజీనగర్ వెళ్ళే రోడ్డు అధ్వాన్నంగా వుంది. వర్షాలువస్తే ఏదిగుంటో, ఏదిరోడ్డో తెలియదు. అప్పుడప్పుడు లారీలుకూడా ఈ దారిన వెళ్తుంటాయి. రోడ్డుకు రెండు ప్రక్కలా అంగళ్ళు; వాటి ఎదురుగా అడ్డదిడ్డంగా పెట్టిన సైకిళ్ళు, రిక్షాలు; ఈ అడ్డాలు చాలక, రోడ్డు వేయడానికని తెచ్చి కంకర తోలి వున్నారు. ఏడాది గడిచినా, రోడ్డు వేసిందిలేదు. ఆ కంకరలోని మట్టి అంతా కొట్టుకొనివచ్చి రోడ్డును బురదమయం చేసింది. గేటు దగ్గరనుంచి ఎర్రబల్లె సాంఘం బ్రిడ్జి వరకు రోడ్డుపై తిరిగే వారికి నరకం కన్పిస్తున్నది.

సందుల్లో గొందుల్లో సిమెంటురోడ్లు వేయించే మునిసిపాలిటీకి ఇంత అధ్వాన్నమైనరోడ్డు ఎందుకు కన్పడడంలేదు. ఏ కాంట్రాక్టరునో బాగుపరచడానికి కంకర రోడ్డు వేయించి, ప్రజలప్రాణాలు తోడేసే కంటే అక్కడ తారురోడ్డయినా వేయకూడదా!

నెల్లూరు —ఎస్. పిచ్చైరావు.

### పసిపిల్లల గుడ్డలు మాయంచేస్తున్నారు!

సంక్షేమశాఖ వసతిగృహాలలో పిల్లలకు గుడ్డలుకుట్టే విషయంలో బొగస్

—తరువాత 11వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

### విహార్శకుడు

## ఎన్నికలు

శాసనసభ ఎన్నికలకు 28 తేదినుంచి దాఖలేసేన్లు ప్రారంభమౌతున్నాయి 30 తేది తుదిగడువు. నవంబరు 2 లోగా ఉపసంహరణలు పూర్తికావాలి; 22 తేది పోలింగు. ఓట్ల లెక్కింపుమాత్రం 26 తేది జరుగుతుంది.

నెల్లూరుజిల్లాలోని మొత్తం 11 శాసనసభాస్థానాలలో 18 లక్షల 82 వేల 868 మంది ఓటర్లున్నారు. ఇందులో స్త్రీలు 8 లక్షల 23 వేల 222 మంది; పురుషులు 8,10,644 మంది. అంటే మగవారికంటే ఆడవారిసంఖ్య 2 లక్షల 11 వేలు అధికమన్నమాట. 1985నాటి అసెంబ్లీ ఎన్నికలలో ఓటర్ల సంఖ్య 18 లక్షల 15 వేల 817 ఈనాటిగణ్యలో 3 లక్షల 17 వేల మంది పెరిగారు. 18 సంవత్సరాల ఓటు హక్కు మహిమ ఇది.

జిల్లాలో ఎన్నికలఏర్పాట్లకు సంబంధించిన హడావుడి ఇంకా మొదలు కాలేదు. కలెక్టర్ శ్రీ కె. రాజు హైదరాబాదుకువెళ్ళి వున్నారు. ఆయన తిరిగి వచ్చిన తర్వాత ఆ తతంగం మొదలౌతుందేమో!

## డీ ఆర్ ఓ బదలీ

నెల్లూరుజిల్లా రెవిన్యూ అధికారి శ్రీ టి. సత్యనారాయణరావు చిత్తూరుజిల్లాకు బదలీ అయ్యారు; రేపు (21) తేది రిలీవ్ అవుతున్నారు. నెల్లూరులో రాసిల్దారుగాపనిచేసి వెళ్ళిన శ్రీ సి. సత్యనారాయణను ఇక్కడ నియమి రాదు. ఆయన సెంఫులో వున్నారట. ఎప్పటాస్తారో తెలియదు.

సత్యనారాయణగారు నెల్లూరులో వున్నది కొద్దికాలమే; కానీ, డి ఆర్ ఓ పదవిలోని రుచి, రంగు, వాసన అందరికీ చూపించివెళ్ళారు. ఆ పదవికే విలువ, హుందాతనం తెచ్చిపెట్టారు. రెవిన్యూ వుద్యోగులందరికీ ఆయన 'రక్షకుడి' గా వ్యవహరించేవారు. ఇంత మంచి పేరుంది కాబట్టే, చంద్రబాబు స్వయంగా చిత్తూరుకు తీసుకువెళుతున్నారు. మరింత పెద్ద పదవిలో ఆయన నెల్లూరుకు తిరిగిరావాలని మా అభిలాష.

## యూరాలజీ క్లినిక్

కిడ్నీ, మూత్రసంబంధమైన వ్యాధుల వైద్యవిభాగం - యూరాలజీ నిపుణుడు డాక్టర్ ఎం. మోహనరాజు నెల్లూరు ఇందిరాభవన్ ప్రక్కన క్లినిక్ ప్రారంభించారు. నెల్లూరులో యూరాలజిస్టు రావడం ఇదే! కిడ్నీలో రాళ్ళు తొలగించడం, ఇతర వ్యాధులకు సంబంధించిన అత్యంతాధునిక ఎండోస్కోపిక్ పరికరాలుకూడా విదేశాలనుంచి తెప్పించి పెడుతున్నారాయన. ఇప్పటిదాకా ఈ అత్యాధునిక వైద్యసదుపాయం మద్రాసువంటి నగరాలకే పరిమితమైవుండేది.

డాక్టర్ రాజుగారు తిరుపతి వాస్తవ్యులట; ఢిల్లీలోని ఆలిండియా మెడికల్ ఇన్స్టిట్యూట్లో ఎం. ఎస్. చదివారు; పాండిచేరి జిప్మర్ వైద్యశాలలో యూరాలజీ నిపుణుడుగా పనిచేశారు. ఆయనకు మా శుభాకాంక్షలు.

# తెలుగుదేశంలోనూ అయోమయమే!

కాంగ్రెసుతో పోలిస్తే తెలుగుదేశం టిక్కెట్ల పరిస్థితి ఇంకా అయోమయంగా వుంది. కేంద్ర నాయకులతో సంబంధాలున్న జిల్లా కొందరు కాకుంటే కొందరైనా పూర్తి విశ్వాసంతో వున్నారు. బెజవాడ పాపిరెడ్డి, ఆనం రామనారాయణరెడ్డిలతో సహా తెలుగుదేశంలో ఎవ్వరూ తమ టిక్కెటుపైనసైతం భరోసా ప్రదర్శించలేకపోతున్నారు.

జిల్లానాయకులందరినీ 31 తేదితదయం గండిపేటకు రమ్మన్నారట. పరీక్షహాలుకు వెళ్ళే విద్యార్థులలాగా టెన్షన్లో వున్నారందరూ. లోపలికి పోయినదాకా ఎవరి జాతకాలెట్లుంటాయో తెలియదుమరి! ఒక ఉపశమనం- నెల్లూరు జిల్లావరకు ఎన్ టి రామారావు టిక్కెట్లలో పెద్దగా జోక్యం చేయరనే అభిప్రాయం వుండటం. జనార్దనరెడ్డి, శ్రీనివాసులురెడ్డిలను రాజకీయంగా ఎదుర్కోవడానికి కొందరు నాయకులకైనా అవకాశమిస్తారని ఊహ.

పాపిరెడ్డిగారు తనకుఏటిక్కెట్టూ వద్దంటున్నారు; కానీ కోవూరు ఇస్తే కాదనరు! రామనారాయణరెడ్డికి సర్వేపల్లి కావాలనివుంది. మంత్రిగా ఇతర నియోజకవర్గాల సంగతి చూడాలిగాబట్టి, 'తిరుగుమ్ముకమ' లేని స్థానంవుంటే మంచిదని ఆయనకోరిక. కానీ రాపూరే అంటగట్టేటట్టున్నారని తెలుస్తున్నది రమేష్రెడ్డికి నెల్లూరు ఖాయమైపోయిందని అభిమానులు చెప్పుకుంటున్నారు. నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డిగారికి వెంకటగిరిపై ఆశవుంది. సిసీ నిర్మాత శ్రీ ఎస్. గోపాలరెడ్డి పేరు ఈ స్థానానికి పరిశీలనలో వుంది. ఆయన వెనక్కు తగ్గితేనే ఎన్ సి కి ఛాన్సు.

ధనెంకులనరసింహం, స్పిన్నింగ్మిల్లు రమణయ్య, మార్కెటింగ్ సొసైటీ బాబు కావులు ఉదయగిరి, ఆత్మకూరులతో తమ కొకటి ఇవ్వాలని పట్టుబడుతున్నారు. కానీ, సుంకర పాపయ్యరావు హరికృష్ణ ద్వారా ఉదయగిరి సీటును ఖాయం చేసుకుని వున్నారట. ఆలయన్స్లోకి వెంకయ్య నాయుడు దాన్ని కోరితే పరిస్థితి ఏమిటి? కావలి కొండపనాయుడు, కందర్ల విజయభాస్కర్ల మధ్య వుంది ఇద్దరికీ కాకుండా మరొక వెనుకబడిన తరగతులకు చెందిన యువకుడికి ఇవ్వరాదా అని ఆలోచిస్తున్నారు. అల్లూరు సి పి ఎం కే పోతుంది! మాట్లాడే...

చిత్తూరుజిల్లా సర్వేపల్లితోనే. ఆ సీటు అడగనివాడు పాపార్ధుడు ఎవరికి ప్రాప్తి పెట్టివుందో ఊహకుకూడా అందడంలేదు. సూళ్ళూరుపేటలో నజెయ్యకే మళ్ళీ ఛాన్సు దొరకవచ్చునంటారు. వేనాటి సోదరులు ఏదీ పట్టి తుడోపడంలేదు. పార్లమెంటుకు అవకాశం దొరకకుంటే బల్లి దుర్గాప్రసాదే గూడూరుకు అభ్యర్థి అవుతారట.

ఆనం వివేకానందరెడ్డి జిల్లాలో ఏ సీటు ఇచ్చినా తీసుకుంటున్నారు; కానీ ఒక యింట్లో రెండు టిక్కెట్లు అసాధ్యమౌతుందేమో!

★

> **నాయకులనుకునేవారికే తమకు టిక్కెట్లు వస్తాయన్న నమ్మకంలేదు!**

## ట్రెజరీ స్వాహాలో స్టేట్ బ్యాంక్ లేదు!

నెల్లూరు ట్రెజరీ పేదల పెన్షన్ల స్వాహా సంఘటనలో తమ బ్యాంకు ప్రమేయం లేదని స్టేట్బ్యాంక్ కారకాసు బ్రాంచి మేనేజర్ శ్రీ దామోదరంచెప్పారు. డ్రాఫ్టుల విషయంలో తాము పోస్టాఫీసుకు ఏవిధమైన తేలిగా పంపలేదనికూడా తెలియజేశారు. అనవసరంగా తమ బ్యాంకు పేరు ఇరికించారని బాధపడ్డారాయన.

ఈ కుంభకోణంలో బ్యాంకుకుసంబంధం లేకుంటే; మావార్తపట్ల విచారం ప్రకటించడానికి మేము సిద్ధమే!

## పార్థసారథి

దేవాదాయ ధర్మాదాయశాఖ కమీషనర్ శ్రీ ఆర్. పార్థసారథి 30 తేది నెల్లూరు వస్తారు; 31 తేది వరకు జిల్లాలోని అన్ని ప్రముఖ దేవాలయాలూ సందర్శిస్తారు.

## నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు (9672) | వడ్లు | 2100.00 |
| ,, (9674) | | 2300.00 |
| ఐ. ఆర్. 20 | ,, | 1950.00 |
| సున్నాలు | ,, | 1750.00 |
| మొలగొలుకు బియ్యం (70 కి) | | 280.00 |

# మద్రాసు పెండ్లి

గూడూరు వాసులకు కోట జనార్దనరెడ్డిగా, దక్షిణదేశానికి రాళ్ళ (గ్రానైట్) జనార్దనరెడ్డిగా ప్రఖ్యాతిగాంచి, తమిళనాడు గ్రానైట్ క్వారీ ఓనర్స్ అండ్ ఎక్స్పోర్ట్ అసోసియేషన్ సెక్రటరీ జనరల్గా 1977 నుండి ఉంటూ, పాండిచ్చేరి, దిండివనం ప్రాంతాలవారికి పాఠశాలలు, దేవాలయాలు, వైద్యకేంద్రాలు ఖారీవిరాళాలతో ఏర్పరచి, వారిచే "అపర దానకర్ణుడు"గా కీర్తింపబడి, అంతటితోచాలక రుస్తుం గ్రూప్ ఆఫ్ మైకామైన్స్ స్థాపించి, "మైకా ఛాంబర్స్" అధ్యక్షునిగా కొనసాగుతూ, యిటు పరిశ్రమలోను, అటుకార్మికులలోను, ఎంతో ఆదరణ, అనురాగం, ఆత్మీయత, అభిమానం సంపాదించుకొన్న శ్రీ సిద్దారెడ్డి జనార్దనరెడ్డిగారు తమ పుత్రిక చి॥ సౌ॥ సుమనను హైదరాబాద్ వాస్తవ్యులు అమెరికాలో ఉన్నతవిద్యనభ్యసించిన చి॥ దివాకర్ రెడ్డిగారితో B.E., M.S.(U.S.A.) 15-10-89 తేది రాత్రి 10 గంటల పైన మద్రాసు ఎ. వి. యం. రాజేశ్వరి కళ్యాణ మండపములో దేవేంద్రలోకంగా తీర్చిదిద్దిన కళ్యాణవేదికపై అత్యంత వైభవంగా వివాహము జరిపించెను. వివాహమునకు ముందు సినిమా గాయకులు వి. రామకృష్ణ, మాధవపెద్ది సత్యం గార్ల పాటకచేరి జరిగినది. పై వివాహమునకు నవేరా అధిపతులు, శ్రీ ఎ. శ్యామసుందర రెడ్డి శ్రీ ఎ.వి.కె. రెడ్డి శ్రీ యం. రామరాఘవరెడ్డిగార్లు, సినిమాపరిశ్రమలోని నటీనటులు, గాయకులు, రాజకీయవేత్తలు, గనుల యజమానులు, అధికారులు, వేలసంఖ్యలో విచ్చేసి వధూవరులను ఆశీర్వదించిరి. శ్రీ జనార్దనరెడ్డిగారి మంచితనమునకు నిదర్శనముగా విశాలమైన కళ్యాణమండపము అశేష అభిమానులతో క్రిక్కిరిసిపోయినది.



వధూవరుల జంట ! ముద్దులొలికించు మురిపాల
బాల మా సుమన
చిరునవ్వులు చిందించు రతనాల
మా దివాకర రెడ్డి
కోటి దివ్వెలు వెలిగించు ముత్యాల
జంట
చూడముచ్చట జంట శ్రీ జనార్దన
రెడ్డిగారి ఇంట

# టివి చిత్రాలు ఫ్యాషనైపోయాయి!

ఈమధ్య చాలామంది టి.వి. చిత్రాలను తీస్తున్నారని చెప్పుకోవటం గొప్ప విషయమైపోయింది. హైదరాబాద్ 'దూరదర్శన్' అధికారుల ధర్మమా అని చాలామంది టి.వి. చిత్రాలు నిర్మించడంలో నిమగ్నులయ్యారు. సినిమాకైనా ప్లాప్ అయితే నష్టపోతుంటారు కాని, టి.వి. చిత్రాలవల్ల ఏమాత్రం పోకపోవడం. యుమేటిక్ టేపులో తీసే టెలిఫిల్మ్‌కి 6 లక్షలు, 16 ఎం. ఎం. ఫిలిమ్‌మీద తీసే కార్యక్రమానికి ఏడు లక్షలు ఇస్తారు. దూరదర్శన్ అధికారులతో కాస్త సాన్నిహిత్యం వుంటే చాలు. ఏ స్క్రిప్టునైనా ఆమోదింపజేయవచ్చునని చాలారోజుల్లో వినబడుతోంది. ఇందులో ఎక్కడా దాపరికమేమీ లేదు. అంతా బాహాటమే. 'ఏమిటండీ ఇంత ఛండాలమైన నాటకాన్ని ప్రసారం చేశారు' అని అడిగితే, మమ్మల్నేం సెన్సార్ బోర్డు ఆమోదించడం అన్యాయమని ఉపేంద్ర విమర్శ. గతంలో తయారైన "నాపిలుపే ప్రభంజనం, సాహసమే నా ఊపిరి" చిత్రాలలో ముఖ్యమంత్రిని ఎద్దేవా చేయడం గర్హనీయమని. త్వరలో విడుదలయ్యే "కలియుగ విశ్వామిత్ర 1990", "గండిపేట రహస్యం" చిత్రాలు కూడా ఇదే కోవలోకి వస్తాయని.

—తరువాయి 11 వ పేజీలో

## మద్రాసు సినిమా వార్తలు

చెయ్యమంటారండీ' అంటున్నా మంచి స్క్రిప్టులు మాకు రావటంలేదు' అంటారు అధికారులు. ఒక వంక చెత్తసినిమాలు చూడలేక మరోవంక పరమచెత్త దూరదర్శన్ కార్యక్రమాలు చూడలేక సతమతమవుతున్నారు తెలుగు ప్రజలు. ఢిల్లీలో హైదరాబాదు దూరదర్శన్ కేంద్రానికి తెలుగువారైన డైరెక్టర్ వచ్చాక కార్యక్రమాలు అంతో ఇంతో మెరుగుపడతాయని ఆశించారు చాలామంది. కానీ మరీ నాసిరకంగా తయారవుతున్నాయన్నది అందరూ ఎరిగినసత్యమే. అలాగే చిత్రలహరి కార్యక్రమానికి ఎంపికచేసే ప్రతి పాటకూ రూ 650 లు యిస్తారు. ఇందులో దళారీలు, మధ్యవర్తులు, కమిషన్లు, అమ్మామ్మాలు బహిరంగంగానే చేతులు మారుతాయి. ఇకశనివారంనాడు ప్రసారం చేసే చెత్త తెలుగుచిత్రాలు గురించి చెప్పనక్కర్లేదు కైలంపడేస్తే, ఎలాంటి చెత్త చిత్రమైనా ఇట్టే ప్రసారమైపోతుందని అందరూ చెప్పుకుంటున్నారు. 'మంచి చిత్రాలు వేయకూడదటండీ?' అనిఅడిగితే 'అసలు మంచిచిత్రాలు ఇప్పుడెక్కడ తయారవుతున్నాయండీ' అంటారు అధికారులు ధనమూలం మిదం జగత్.

### రాజకీయ వ్యంగ్య చిత్రాలపై ఉపేంద్ర అక్కసు

ముఖ్యమంత్రిని అప్రతిష్ఠపాలుచేసే రీతిలో తయారయ్యే చిత్రాలను ప్రాంతీయ

"రౌడీయిజం జిందాబాద్"లో డాక్టర్ రాజశేఖర్—వాణీవిశ్వనాథ్

## ఎన్టీఆర్‌ను అన్నివిధాలా ఏకిపారేశారు!

# కలియుగ విశ్వామిత్రుడు

"నేటి మా ఊహలే రేపటి నగ్న సత్యాలు". ఈ విషయాన్ని చిత్రం ఓవరన ఈ చిత్రదర్శకుడు ప్రదీప్‌శక్తి, నిర్మాత యమ్. సూర్యనారాయణబాబు వారి కవీసధర్మంగా తెలియజేస్తారు. నేటి వారి ఊహలను వారు చిత్రమంతటా బాహాటంగా వెల్లడించారు. ఒక ముఖ్యమంత్రి తాను ప్రజలకు చేసిన వాగ్దానాలను నెరవేర్చక పోగా తన స్వంతానికి కోట్లు గడించుకొంటాడు. ప్రజాభిమానం కోల్పోయిన ముఖ్యమంత్రి తనపదవిని వదలకొని గవర్నరు పరిపాలన పెట్టమనికోరి, పదవి పోగానే మతి మాలాపోయి వీధుల్లోతిరుగుతుంటే ప్రజలు అతడ్ని పిచ్చాసుపత్రిలో చేరుస్తారు. ఇక పదవులు కోల్పోయిన రెవిన్యూమంత్రి నిమ్మతోటకు నీరెత్తుకుంటాడు. మునిసిపల్ మంత్రి స్మశానంలో ఇంత్రీలు అమ్ముకుంటాడు, విద్యాశాఖామంత్రిణి చిత్తుకాగితాలుకొనే కొట్టుపెట్టుకుంటుంది. ఇట్లా పదవులు కోల్పోయిన అన్నిశాఖల మంత్రులం దీనావస్థను తీర్చి చెప్పారు.

ఇవి దర్శక, నిర్మాతల నేటి ఊహలు. ఈఊహలేరేపటికి నగ్నసత్యాలవుతాయట. "రేపు" అంటే 1990 లో అన్నమాట. 1990 మార్చి ప్రాంతంలో అసెంబ్లీ ఎన్నికలు జరగవచ్చు. ఆ ఎన్నికలలో ముఖ్యమంత్రి, ఆయనివర్గమూ ఓడిపోయి, పైన చెప్పిన అధోగతిలో పడిపోతారన్నది నగ్న సత్యమని చెప్తున్నాడు దర్శక నిర్మాతలు.

ఇక చిత్రానికి "1990 కలియుగ విశ్వామిత్ర" అన్నపేరు పెట్టడంలో పరమార్థమేమిటన్న ప్రశ్న మనకు ఎదురవవచ్చు. దానికి సమాధానం ఇట్లా చెప్పుకోవచ్చు. ముఖ్యమంత్రి అన్ని ప్రజాకార్యక్రమాలను ప్రక్కకు నెట్టి విశ్వామిత్ర సినిమా నిర్మాణంలో పూర్తిగా మునిగిపోయాడట. తానే విశ్వామిత్రగా, విశ్వామిత్రతానుగా లీనమైపోయాడట. అందువల్ల "1990 కలియుగ విశ్వామిత్ర"- అని నామకరణం చేశారట.

### చిత్ర సమీక్ష
### గ్రిద్దలూరు గోపాలరావు

"ఈ చిత్రంలో పాత్రలు ఎవరినీ ఉద్దేశించినవికావు" అని చిత్రం ప్రారంభంలో తెరమీద చూపినా, ముఖ్యమంత్రి బూదిద బాబూరావు పాత్ర యన్టీ రామారావే! అట్లాగే "త్రిలింగదేశం" (తెలుగు దేశంలాగా) పార్టీ సెక్రటరీ ఇంద్రబాబు పాత్ర, ఎన్టీ ఆర్ అల్లుడు చంద్రబాబు నాయుడే! అంతటితో ఆగకుండా "సాహసమే నా ఊపిరి" చిత్రంలో లాగా ముఖ్యమంత్రి పాత్రను వేషభాషల్లో ముమ్మూర్తులా యన్టీఆర్‌లాగా తీర్చిదిద్దారు. ముఖ్యమంత్రి ఆకారంలోనేకాదు విశ్వామిత్ర వేషంలోనూ అట్లాగే అచ్చుగుద్దారు. "సాహసమే నా ఊపిరి" చిత్రంలో ముఖ్యమంత్రి పాత్రను పోషించిన సుధాకరే ఈ చిత్రంలోనూ ముఖ్యమంత్రి పాత్రను, విశ్వామిత్ర వేషాన్ని ధరించారు. ఇతను యన్టీఆరేనా అన్న భ్రాంతిని ప్రతి కదలికలోను కనపరచాడు సుధాకర్.

ఈచిత్రం ముఖ్యమంత్రి మీద, అతని అల్లుడి మీద ఎక్కుపెట్టిన విమర్శనాస్త్రమని ప్రత్యేకించి చెప్పనవసరంలేదు. ప్రదీప్‌శక్తి వ్రాసిన కథలో కథంటూ ఏమీలేదు. ముఖ్యమంత్రిని బాగా ఉతికి ఆరెయ్యడమే చిత్ర కథనమంతా.

ముఖ్యమంత్రి మాటను పాటించకుండా ఎదురుసలహా ఇచ్చిన చీఫ్ సెక్రటరీ హత్యాకాండతో చిత్రం ప్రారంభమవుతుంది. ఆతర్వాత ముఖ్యమంత్రి స్వార్థపు చర్యలు, నిరంకుశపాలన, ప్రజలు పరదలకు గుర్రై రోదిస్తూవుంటే, వారిని పరామర్శించడంమాని విశ్వామిత్ర మాటింగులో మేనకతో కులుకడము, షూటింగు జరిగే స్టూడియోచుట్టూ పోలీసు బందోబస్తు పెట్టి అధికార దుర్వినియోగం చెయ్యడం; పోలీస్ కానిస్టేబులుచేత మేనక చెప్పులు తెప్పించడం, విశ్వామిత్ర వేషంలోనే మేనకను తన తొడలపై కూర్చోపెట్టేసి, ఆమె వీపుమీద ఆఫీసుఫైళ్ళు పెట్టి ముఖ్యమంత్రి సంతకాలుచెయ్యటము, ముఖ్యమంత్రి పదవిని అర్థంపెట్టుకొని విశ్వామిత్ర చిత్రం

జిల్లావారీ ప్రదర్శన హక్కులు ఎక్కువ రేటుకు అమ్మటము, రాజకీయ పాతకాలంలో త్రిలింగదేశం కార్యకర్తలకు హిట్లర్ నియంతృత్వాన్ని మెచ్చుకుంటూ పాఠాలు చెప్పటము, ముఖ్యమంత్రి హిట్లరువంటి వాడన్న విమర్శకు తావివ్వటము, మంత్రులనంతా హోల్‌మొత్తంగా ఒక్కసారిగా డిస్మిస్ చెయ్యటం, యం.పి.లందరి రాజీనామాలు చెయ్యించి వారికి పెన్షనుకూడా లేకుండా చేశామని గొప్పగా చెప్పుకోవటము, ఇట్లా ముఖ్యమంత్రిమీద ఎన్నో విమర్శలు చేసారు. ఈ విమర్శలన్నిటిలోనూ శివసూర్య వ్రాసిన మాటలు, శక్తిక్రియేషన్సు సృష్టించిన పాటలు విమర్శనాస్త్రాలనుంచి సంధించి వదిలిన వాడిబాణాల్లా పనిచేశాయి.

విశ్వామిత్ర మేనకల ప్రణయం, నృత్యాల సినిమా షూటింగు ఎక్కువగానే చూపారు. వ్యంగరీతిలో ఆకర్షణీయంగానే వుంది. తీవ్రవాదులు ముఖ్యమంత్రిని

-తరువాయి 11వ పేజీలో

## సోమశిలలో సవేరా చిత్రం

'సవేరా హోటల్' ఎ. వి. ఎ. రెడ్డి అంధ్రులు గుర్తించే చక్కని చిత్రాలను సమర్పించడానికి కంకణం కట్టుకున్న విషయం అందరికీ తెలిసిందే. వీరు ఇటీవల సైక్రిటెన్ ద్వితీయచిత్రంలో కుమార్ ఫారెస్ట్ ఆఫీసర్. సోమశిలలో షూటింగ్ ప్రారంభమైంది. రెండో షెడ్యూల్ అరకులోయలో జరుగుతుంది. భానుప్రియ, సీత, గొల్లపూడి మారుతీరావు, వేలు, కోట శ్రీనివాసరావు, నర్రా వెంకటేశ్వరరావు, రాళ్ళపల్లి, చలపతిరావు, రిల్లీబాబు నటిస్తున్నారు. కథ, సంభాషణలు : గొల్లపూడి మారుతీరావు. సంగీతం : చక్రవర్తి. కెమెరా : దశరథరాం. నిర్వహణ: సురేందర్ రెడ్డి.

### ఖైదుచేయవద్దని నటి విన్నపం

తనను ఖైదు చేయవద్దని, తాను తప్పకుండా విచారణకు హాజరవుతానని 'మయూరి' సుధాచంద్రన్ కేరళ హైకోర్టుకు విజ్ఞప్తి చేసింది. 'నమ్మినవారికి నాశము లేదు'' అనే తమిళచిత్రం షూటింగ్ పవిత్రమైన శబరిమలై ఆలయంలో జరిగింది. ఇందుకు అభ్యంతరంచెపుతూ ఒక భక్తుడు తిరువనంతపురం కోర్టులో కేసు పెట్టాడు. సెప్టెంబర్ 4వ విచారణకు హాజరుకావాలని ఆ చిత్ర నాయిక సుధా చంద్రన్‌కు సమన్లు వచ్చింది. కాని, ఆ సమయంలో బొంబాయిలో ఒక హిందీ చిత్రం షూటింగ్‌లో పాల్గొంటున్నందున సుధాచంద్రన్ హాజరవలేకపోయింది. దాంతో ఆమెకు జామీనులేని వారంటు పంపబడింది. ఆమెను ఖైదుచేయమంటూ బొంబాయి పోలీసులకు తాఖీదులు వెళ్లాయి కూడా. దాంతో నటి తాను తప్పకుండా హాజరవుతానని విజ్ఞాపన పత్రం పంపింది. చివరికి వారంటు ఉపసంహరించుకోబడింది.

# ద్వితీయ వర్ధంతి

## డా॥ పి. శ్రీనివాసులురెడ్డి

PAEDIATRICIAN.



జననం : 26-4-1943 మరణం : 23-10-87

నీతో వెన్నెలను
తీసుక పోయావు
మాకు చీకటి మిగిల్చావు
నీతో వసంతాన్ని తీసుక పోయావు
మాకు శిశిరం మిగిల్చావు

విషాదపు మేఘాలు
మా మనసుల్ని ఆక్రమించాయి

నీవు వెదజల్లిన
స్నేహార్ద్ర సౌరభాల్ని
అనుదినము ఆస్వాదిస్తూ
నీ స్మృతుల నక్షత్రాల్ని
మా గుండెల్లో దాచుకుంటాం।

ఆర్ద్రహృదయాలతో
తల్లి - వెంకటసుబ్బమ్మ
భార్య - డా॥ పద్మావతి
కుమార్తె - సమీర
కుమారుడు - హరీష్

Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press, - Nellore 524 001